# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# ANDHRA RASTRA PRARAMBHA VIDYA

## విద్యావిషయిక మాసపత్రిక


| సంపుటము 32 | ఏలూరు 15 జూలై | సంచిక 4 |
| --- | --- | --- |




## నిత్యసంకీర్తనము

**వివరణము :**

నమ్రత జీవితమున కలంకారమువంటిది. అతి వినయముతో నీహస్తమును భగవంతుని హస్తములోనుంచినపుడు-శరణాగతుడవైనపుడు-నీకేమియు భయముండదు. శరణాగతుడవగు నిన్ను ఎవరును భగవంతునకు దూరమొనర్పజాలరు. వినయవంతులే భగవదాశీర్వాదమును భరింపఁగలరు. అన్వేషకులలోఁ బెక్కురకములవారు గలరు. కొందఱుభక్తులు-మఱికొందఱు యోగులు-ఇంక కొందఱు శరణాగతులు. యోగుల చిత్తమునఁ గొంత సాత్వికాహంకారముండును. శరణాగతులు అతి నమ్రతతోనుందురు.

**సంకీర్తనము:**

1. ప్రభూ ! నాకు వినయము ననుగ్రహింపుము.
2. ఈ యహంకారమును, గర్వమును, నానుండి పాఱదోలుము.
3. నాచిత్తము వినయ ప్రపూరితమై సదా నీ సేవనొనర్చుచుండునుగాక !

—స్వామి రామతీర్థ

# వందనము

చిలకా వేంకట కృష్ణదాసు

1. నవసుధారసవీచిలో స్నానమాడు
కోకిలరవముతో శ్రుతిగూర్చి పాడు
నవ్యసాహిత్యలోకాన నాట్యమాడు
భారతాంబరో కొనుము నావందనంబు.

2. జ్ఞానబీజములను నాటి సకలజనుల
భావిపౌరులుగాఁ జేసి భరతమాత
కర్పణముచేయు సకలకష్టాల కోర్చు
ప్రాథమిక బోధకా! నీకు వందనంబు

3. కష్టముల కోర్చి పండించి గడనచేసి
క్షేత్రనాథులపాల్జేసి చింతఁ జిక్కి
లేమి యనియెడు భామతో సాముచేయు
పాలికాపున కొనరింతు వందనంబు.

---

# దేశమాత

రచయిత : మేడూరు ఉమామహేశ్వరం

ఉ. పావనమై దిశాంతరప్రవాహితమై ఘనమై రసజ్ఞసం
భావితమై సుధారససువర్ణమునై వెలుగొందు నీయశ
శ్శ్రీవిభవంబు నాహృదయసీమఁ జలింపఁగ వ్రాయుచుంటి, నీ
దీవనలందఁ గోరి వెనుదీయకఁ గావగదమ్మ తల్లిరో!

మ. అల దిగ్దంతులవంటి నీసుతులు జవ్హార్లాలు గాంధీమహా
త్ములు రాగూరు కవీంద్ర ముఖ్యులు గుణాత్ముల్ తారు ఖండాంతరం
బుల ఖ్యాతింగొని వాసికెక్కిరి భవత్స్వాంశోద రాధిక్యతన్
బలుకన్ బ్రహ్మకునైన శక్యమే మదంబా! మాట లింకేటికిన్.

సీ. రాజపుత్రుల పరాక్రమరాజిగరిమంబు తలమానికంబుగాఁ దనరుచుండ
పల్నాటివీరదర్పంబు సొంపెసలారు రత్నాలకంఠహారముగ నెనగఁ
దెలుగువారల పాండితీశోభవిభవంబు ముంజేతికంకణంబు గఁదలిర్ప
అల కృష్ణదేవరాయల విశాలయశంబు ధవళదుకూలవస్త్రముగ నొప్ప

గీ. హిమనగం బింక దివ్యఛత్రముగ వెలుఁగ ఆసియాఖండమను సుచితాసనమున
వేడ్కఁగూర్చుండి సంతానవిభవ మెపుడునరయు చుంటివిగాదె కల్యాణలక్ష్మి!

శా. నీకారుణ్యరసంబు గట్లుతెగి క్షోణిన్ గౌతమీ కృష్ణ గం
గా కావేరి తరంగిణీమణులుగా గన్పట్టి నెల్లప్పుడున్
వీకన్ తన్మహనీయవాహినుల పెన్నీరంబు క్షీరంబులై
లోకత్రాణ మొనర్చుచుండె పలుమారుల్ పంతల బెంచుచున్
గీ. నీదుగర్భాన జనన మొందినకుమారు లేదిగి పెరుగుచు నుండి కేలేట, దరుగ
దించు కంతైనలే దహా! యెంత కడుపుచలువగల తల్లి వమ్మ మజ్జనని నీవు!

---

# బాలనీతిశతకము

## నవమదశకము

### దేశభక్తి - దేశపర్యటనము - కాలము.

(గతసంచిక తరువాయి)

బాలకవి : వాకాటి పెంచలరెడ్డి

తే॥ గీ॥ మాటయందున తీపి నెమ్మది విషంబుఁ । గలిగి దేశంబువంచించు ఖలునికంటె
శత్రుపక్షంబుఁ జేరెడు - జనుఁడు మేలు । సుప్రసాద! శ్రీకాళీవరప్రసాద. 1
తే॥ గీ॥ తాత ముత్తాత తండ్రుల తరమునుండి । కాచి యన్నపానము లిడఁ గలిగినట్టి
మాతృదేశవిద్రోహంబు మనకుఁ దగదు । సుప్రసాద? శ్రీకాళీవరప్రసాద. 2
తే॥ గీ॥ పూర్వమున కృష్ణరాయాది ముఖ్యనృపులు । చనినత్రోవనె పోవుట చనునుగాని
క్రోలి చనుబాలు గ్రుద్దెడు - లీల వలదు । సుప్రసాద! శ్రీకాళీవరప్రసాద. 3
తే॥ గీ॥ ఒరుల నర్థించి వారియా - దరమువలన । లక్ష లార్జించుకంటెను భిక్షమైన
మేలు స్వాతంత్ర్యసౌఖ్య మే - లీల ఘనము । సుప్రసాద! శ్రీకాళీవరప్రసాద. 4
తే॥ గీ॥ కష్టసుఖములు నరునకు ఖండితముగ । తెలియవలెనన్న దేశంబు తిరుగవలయు
అట్లుగాకున్న విజ్ఞాన మెట్లుగలుగు? సుప్రసాద! శ్రీకాళీవరప్రసాద. 5
తే. గీ. దేశసంచారమునగదా తెల్లముగను । పేరుగాంచినవారలు పెద్దలౌట?
కాన దేశాటనముకన్న ఘనము లేదు । సుప్రసాద! శ్రీ కాళీవరప్రసాద. 6
తే గీ. మోసకృత్యంబులందున దోసములను । పలుతెఱంగుల మనుజుల వ్యక్తపఱుప
జాలగలయది దేశసంచారశక్తి । సుప్రసాద! శ్రీ కాళీవరప్రసాద. 7
తే. గీ. జరిగిపోయినకాలంబు తిరుగరాదు । కాలయాపన మూలంబు కష్టములకు
కాన వృధసేయఁ గూడదు కాల మెపుడు । సుప్రసాద! శ్రీకాళీవరప్రసాద. 8
తే. గీ. పోవుధనమును మఱల తాఁబొందవచ్చు । రోగమబ్బిన వైద్యుడారోగ్యమిచ్చు
కాని పోయినకాలంబుఁ గనము మఱల । సుప్రసాద! శ్రీకాళీవరప్రసాద. 9
తే. గీ. కాలవాహిని జీవులఁ దేల్చి ముంచు । దానిని వివేకగరిమచే దాటవచ్చు
అంచితంబగు కీర్తికాయంబు నిలిపి । సుప్రసాద! శ్రీకాళీవరప్రసాద. 10

(సశేషము)

# కాటకసామ్రాజ్యాధిపతి

కె. ఎ. స్వామి

బడిపంతులు కడుపుకు లేక బాధపడుతున్నాడు. ఆకలిమంటకు అలమటించిపోతున్నాడు. నీరసనిరాశలతో క్రుంగి, కృశించిపోతున్నాడు. బొమికలు ఎండి శరీరముమీద పైకి స్పష్టముగా కనబడుతున్నాయి. మనోవేదనతో మెలికలు తిరిగిపోతున్నాడు.

'ఏమిటిదీ అంటే పంతులయ్యకు నొప్పులన్నారు. దేహమంతా నొప్పులేనట!

గుమ్మ గుమ్మానికీ తిరిగి అందరికీ ఒదిగి-ఒదిగి సలాములు చేసి నొప్పులు తెచ్చుకున్నాడు గురువు. గుమ్మ గుమ్మానికీ పదే పదే తిరుగరాదని పంతులుకు చెప్పలేదు వానితండ్రి.

రాజు మొదలు బంట్లువరకు, కంటికగుపడిన ప్రతివారికీ నమస్కృతులుసమర్పించకూడదని అతనికి చెప్పలేదు వాని తల్లిదండ్రులు.

విజ్ఞాన విద్యకిదిలోచ్చు. ఈ చదువులు గుమాస్తాలను తయారుచేయుటకేగాని ఇతరత్ర మరెందులకు ఉపకరించేవి కావని తెలిసికూడా ప్రతి కుర్రవాని రెక్కపట్టుకొని వాని తల్లిదండ్రులకాళ్లు పట్టుకొని తీసికొనివచ్చి కూర్చోపెడతాడు చదువుగుళ్లో. శరీరములోని ప్రతి అవయవమూ యిందుకే ఉపయోగించి కూర్చుతున్నాడు గొర్రెలమందని. ఇంతమితము తప్పడమా? ఎందుకు నొప్పులురావు?

శరీరముపై విభూతి నలముకొని పుణ్యలోకము చూపు రుద్రాక్షమాలికలు మెడలో ధరించి వల్కలములు ధరించి, చాపపై కూర్చున్న తనదగ్గరకు "అంధప్రక్రియనున్నవాడు పలుకం దన్మాత్రప్రతాపక్రియాగంధం బించుకలేదు మీరు గురువుల్ గారుణ్యచిత్తుల్ 'మనోబంధుల్ మాన్యులు మాకు పెద్దలు మముం బాటించి యీ బాలకున్ గ్రంథంబుల్ సదివించి నీతికుశలుం గావించి రక్షింపరే" అని మర్యాదగా తెచ్చి అప్పగించినవారికే విద్యచెప్పుమని బడిపంతులుకు వాని గురువు ఉపదేశించలేదు. చదివినవారు కొలదిగానున్నను సంతుష్టిపడవలెను. గాని ప్రచారమనవసరమని కూడా చెప్పలేదు వానిగురువు. అందుచేత పంతులు అనాచారముగా ప్రతియింటిలోనూ జొరబడి పిల్లలను గొర్రెలవలె కూర్చి నొప్పులు తెచ్చుకున్నాడు.

"యోగ్యుడౌ అనురూప శిష్యుండు దొరకిన నాయుపాధ్యాయు డాహ్లాదమందుటరుదా!" అన్నకాలము గడచి ఏడ్చుచున్నను, తిట్టుచున్నను, బడిలో కూర్చున్న బాలునిచూచి యుపాధ్యాయు డానందించుకాలము వచ్చినది.

కొందరు మొగమోటము లేకుండా "మా అబ్బాయిలు గొర్రెలు కాస్తారు, నీ బడికిరారు పో" అని కసరి కొట్టారు.

తొందరి "మొంగిలి చదువెందుకు? ఉద్యోగాలు చెయ్యాలా? కొల్లలాలా" అన్నారు,

"నీలాంటి చచ్చు మా పిల్లవానికి చదువు చెప్పనవసరములే" దన్నారు మరికొందరు.

"నీవలన మాకేమి లాభముందని మా అబ్బాయిని బడికి పంపుతామ"న్నారు యింకాకొందరు.

"పోవయ్యా! వెధవచదువ"న్నాడొక పూర్వసువాసిని.

"మాకెందుకీ రజ్జన్నదొక" నిత్య పున్నిస్త్రీ

"చదువులో ఏముంద"న్నాడు రాజా బావమరది.

"నీవెందుకయ్యా ఆలాగు యింటింటికీ తిరుగుతావు? అందరూ మాయింటి చుట్టూ తిరుగుతూ ఉంటే?" అన్నాడు సాని తమ్ముడు.

"గెటవుట్ రాస్కెల్, వెళ్లరా వెంగళప్పా! పోరా శకునపక్షీ! దుర్మార్గుడా? అభాజనుడా! భడవా! కడవా! నడవా" అన్నది లోకము అర్థములేని అర్థమున్న మాటలతో.

"వీడు చాల చెడ్డవాడ"ని పెదిమ విరిచింది ప్రపంచము

* * *

"నీవు అధికముగా కష్టించి నొప్పులు తెచ్చుకున్నావు" అన్నారుపాధ్యాయుని స్నేహితులు.

"నాకానొప్పులు? నాకు నొప్పులులే" వన్నాడు పంతులు.

"మరెందుకీ నొప్పులు?"

"నేనింకా తిరుగగలను. నాకునొప్పులు రావు, రాబోవు" అన్నాడు పంతులు.

"నీ వనలు తిరుగకపోతే బడికి వచ్చిన దద్దమ్మ ఎవరు? పరువుపోతున్నా మర్యాద నిలువబెట్టే దలచావులే" అన్నారు అందరూ ఏకకంఠముతో.

"అదేనాగోల. కోట్లకొలది విద్యాహీనులయిన భారతదేశ ప్రజలకు, పిల్లలకు ఆధ్యాత్మిక, మానసిక, నైసర్గిక, సంగతులను బోధించి జ్ఞానులుగా చేయుటే నా ముఖ్యోద్దేశము" అన్నాడు పంతులు.

"ఎందుకీ అరణ్యరోదన? బడాయి మాటలు: చెప్పబోకు. నీకు గంజికిలేక గురు పుగ్గారి వయ్యావని చెప్పు" అన్నారు మిత్రులు.

"నా సమున్నతాశయాలను బడబానలము, నాభావపుంజములను దావానలము కాల్చివేసినవి. ప్రతివానికీ నీరసమయిపోయినాను. బడిపంతులని సగౌరవంగా పిలిచి, సన్మానదరించేవాడు లేకపోయినాడు, సరిగదా, వెళ్లిననూ కనరికోడతారు మూఢప్రజలు. అది నా వేదన. తిండిలేనందుకు విచారించుటకాదు. విద్యార్జన లేదని కుములుతున్నాను. నొప్పులుకావు. ఆంతరంగిక వేదన. నేను మూలుగుటలేదు. ప్రభాతగీతికలను పాడుచున్నాను అన్నాడుపాధ్యాయుడు.

"ఏమిటాగీతి కలభావము? అర్థములేని మాటలాడుతున్నావు" అన్నారు మిత్రులు.

"మాటలకర్థములేక పోవుటగాదు, మీరు అర్థముచేసుకోలేక పోతున్నారు. "విద్యావిహీనః పశుభిస్సమానః" అన్నారు కాబట్టి పంతులయ్యాకు బ్రతుకుతెరువు కల్పించి ప్రజలందరు విద్యాశిక్షణ పొందవలెనను భావముతో ప్రబోధించుచున్నాను" అన్నా డుపాధ్యాయుడు.

"ఏదోలే ? ఎవరికంపు క్షారికింపని" వారు వెళ్లిపోయినారు.

* * *

ఒకరోజున పరీక్షకు ఇనస్పెక్టరుగారు వచ్చారు.

"చూచుట కింత అసహ్యముగా ఉన్నావేమిటి ? చొక్కా చినిగిపోయింది. నీలో మాస్టరు పెర్సనాలిటీయేలేదు. మరొకటి కొనుక్కోలేక పోయినావు? పోనీ దానినైనా ఉతుక్కోరాదటయ్యా" అన్నాడు అధికారి.

ఇదికూడా రూల్సులో చేర్చారు కాబోలు అనుకొని మౌనంగా ఉన్నాడు పంతులు.

"ఇదేమిటయ్యా న్యూసెన్సు బుగ్గిలో కూర్చోపెట్టావు పిల్లని"

"అక్షరాలు దిద్దటానికండీ"

"ఏమిటీ! స్లేటు కార్డులు ఉపయోగించలేదా? పలకలమీద వ్రాయించకూడదూ. చదువేమి టిలాగుంది ? ఒక బెంచీ అయినా ఉండ నవసరము లేదా? ఇది స్కూలా? సాలా? అని తీవ్రభావముతో అన్నాడు అధికారి.

ఎత్తుఎత్తారు పంతులుగారు "బెంచీ లక్కలేదు. ఫీజులుపుచ్చుకోను, గ్రామ్మంచున్ నిర్ధనుత్రోసి పుచ్చును . . . ." అంటూ మ"మటప్! నీకేమీ బుద్ధి లేదయ్యా! గ్రాంటు పుచ్చుకోవాలని యిష్టముందా? గతసంవత్సర మెంత గ్రాంటు వచ్చినది?"

"మూడు సంవత్సరాలనుండి రాలేదండీ" అన్నాడు పేద బడిపంతులు దీనముగా.

"ఈ సంవత్సరముకూడా గ్రాంటు ఆపివేస్తున్నాను"

"ప్రభువులు రక్షించాలి నిరుపేదను"

"నాన్సెన్సు! నన్నే మోసము చేస్తున్నావు. నేనేమీ ఎరుగననుకున్నావా ఏమిటి?" అని మీనముమీద చేయివైచాడు అధికారి.

"బాబూ! మా కూడు పడగొట్టుట ధర్మము కాదు. అది అత్యాచారము దురంతము మీకు తోడుపల్లాదుగోడు వంతోమమా" అన్నాడు పంతులు.

"ఛీ ఛీ! నోరుముయ్యి. మదోన్మత్తుంగా తిని కారుకూతలు కూస్తున్నావు. ఇదిగో నీకుతగిన ప్రిస్క్రిప్షను ఇస్తున్నాను. బాగ ఠణుగుతుంది." అన్నాడు డి. ఐ. గారు.

పరీక్షా ఫలితముగా:—

| | |
|---|---|
| స్టేట్యూటరీకట్ | 20% |
| గరల్సు ఎన్‌రోల్‌మెంట్ కట్ | 25% |
| స్టాగ్నేషన్ కట్ | 15% |

ఉన్న కట్ • లేనికట్‌లతో తుదకు ప్రోరేటాకట్‌తో సహా $123\frac{9}{10}$ % కట్ వస్తుంది స్కూలు రికగ్నిషను క్యాన్సలు చేస్తున్నాను" అని యీ ద్వారముగుండా ఇనస్పెక్టరుదొరగారు వెళ్లారు. ఆద్వారముగుండా నీ భార్య తిండి లేక చనిపోయిందని కబురువచ్చింది.

* * *

కష్టాలింకా వానివెంట పడుతూనే ఉన్నాయి. వీనినుండివిడిపడేమార్గము నిశ్చయించుకున్నాడు. తన ఉన్నతభావములను మూలగా కుర్చిలోకమునకు చాటినాడు. ఒక్క ఎలుగుతో దేశముకేపగవాడనైతినని తెలిసికొనినాడు. పూర్వగురులను స్మరించుకొనుచు, గమనమున్ను భువక్ర

మించినాడు. "కుక్కలు, నక్కలు, కోళ్లు పొట్టేళ్లు గుంచికొని, మీరు దివ్యచరిత్రుడగు దేవదేవుని కూర్చి, స్తుతించి, శిష్యులకుపదేశించి, వారిని పావనము చేయుదురు. ద్రవ్యమందనాశక్తి గలిగిన అఖండపండితులు, మీరు పెట్టెలుకంటె విభూతినంచియే ముఖ్యము శిష్యులకన్న వస్త్రములిచ్చి, వారికి విద్యనభ్యసింప జేయు ప్రతిభాశాలురు." అని స్తవము గావించినాడు. ధ్యాననిమీలితనేత్రుడైనాడు "నన్ను హింసించునో స్వార్థపరులారా! నేనిప్పుడు కాటకసామ్రాజ్యాధిపతిని. నన్ను మీరేమియు చేయజాలరు." అని ఆత్మఖడ్గము పైకెత్తి అరచినాడు. కాలప్రవాహములో నొక సుడిగుండము జన్మించి నశించినది.

"కాలగర్భంబులో నెన్నికథలుగలవొ!
ంచుచున్నము యుండునే నిలచి
యెప్పుడు"

(వరా:—ఇందలి ఉపాధ్యాయుడు నిర్మలుడు" వానిజీవితమందలి కష్టముల శోకముల అందలి యుందొక తునక యీకల్పన. ఇందుకొన్ని అస్వాభావికపరిసితులుగూడగలవు, గాని నిజమైన విషయములిందుకు తీసిపోవని నాభావన.)

## "మగని చెవిలో"

—చాదరి

ఏమండీ, నిద్రపోతున్నారా? మిమ్మల్నే మల్లీసాగించావు చెవిక్రింద గోలఅంటున్నారా? మరేమీ లేదుగాని దేశము యొక్క నిజమైన అభివృద్ధికి-సమాజము యొక్క ఉన్నతికి, ఎక్కువగా తోడ్పడే దేవరు? ప్రాథమికోపాధ్యాయుడు అంటున్నారా? ఐనప్పుడు దేశముయొక్క సర్వతోముఖాభివృద్ధికి-సభ్యతాగౌరవముకూడ ప్రాథమికోపాధ్యాయుని భుజస్కంధాల అనివున్నది అంటే కాదనలేరుగా అట్టి ప్రాథమికోపాధ్యాయుడిని సమాజము, సమాజము తరపున మీరు, కూడ ఎన్నో విధాలకాపాడుతూ గౌరవింపవలసియున్నది. ఏమీ తెలియని ఈపసిగందులకు వ్రాత, చదువు లెక్కలకే, యోచనాశక్తి, సదసద్వివేచనాశక్తి, దేశభక్తి అణగివున్న ఇతరశక్తులను, రేపి ఉత్తమపౌరులుగా తయారయ్యే బీజాలను నాటి తద్వారా దేశముయొక్క సమాజము యొక్క, గౌరవ మర్యాదలను పెంపొందింపజేస్తున్నాడు అంటే మీరూ కాదనడంలేదుగా? ఐనప్పుడు దేశసౌభాగ్యానికి ప్రాణాధారమువంటివాడగు ప్రాథమికోపాధ్యాయుని స్థానము అత్యున్నతము అంటే కాదనరుగా!

మరి ఐతే ఇన్నిసంగతులు తెలిసిన మీరు ప్రాథమికోపాధ్యాయునికి ఎంతవరకు గౌరవస్థానమిచ్చి గౌరవిస్తున్నారు? నేను ప్రత్యేకముయిచ్చే గౌరవమర్యాదలు ఎంతవరకు అంటున్నారా? యదార్థముగా ఇంత ఉన్నతస్థానాన్ని అలంకరించిన ప్రాథమికోపాధ్యాయుని వృద్ధిక్షయాలను పరికించే నిమిత్తము నియమింపబడిన అధికారవర్గము వారైన మీరు ప్రాథమికోపాధ్యాయుని ఇను

మిక్కిలి కాపాడుతూ ముందుగా మీరు ఆయనను గౌరవించి సమాజానికి మార్గదర్శకముగా వుండాలి అంటున్నా—

నేను ఒకప్పుడు మాత్రము అగౌరవముగా వున్నానా అంటున్నారా? మరి ఉదయాన మీతో మాట్లాడవచ్చిన ఉపాధ్యాయుడు ఎంత వినయముగాను, విధేయతగాను, గౌరవపురస్సరముగాను, మాట్లాడాడు? మరిఆయనను కొట్టానా, తిట్టేనా, అంటున్నారా? ప్రత్యక్షముగా కొట్టడం తిట్టడమే జరగాలా? నేను పైన చెప్పినట్లుగా దేశభవితవ్యాన్ని ఆకలింపు చేసుకోకుండా ఆప్రాథమికోపాధ్యాయుని శక్తియుక్తుల వల్లనే ఉన్నతస్థానాన్ని పొందిన మీరు, అంత నిర్లక్ష్యముగాను, తృణీకారముగాను, మాట్లాడారు అంటే ఇక చెప్పాల్సిందేముంది? ఉపాధ్యాయ లోకానికంతకూ, అన్నివిధాలా ఆదర్శముగా వుండవలసిన మీరు ఆవిధముగా ప్రవర్తించారు అంటే ఇంకేమన్నావుందా ఈ గొడవంతా ఎందుకు? ఏమన్నానో చెప్పరాదు అంటున్నారా? ఆయన ప్రతి మాటకు "ఏమండి, మీరు" అంటూ వినయము ఉట్టిపడేటట్టుగా మాట్లాడుచుంటే, మీరు క్షణక్షణానికి ముఖము చిట్లించుకుంటూ, చీత్కరించినట్లుగా "నువ్వు" "ఏమోయ్" అంటూ అదేమిటి. ఇదేమిటి, అంటూ, రుసరుసలాడుతూ, మాట్లాడారుగదా? మర్యాదేనా? ఓసి! ఇంతేనా, ఏనుగు అంత పెద్దజంతువుగదాయని వెంటవెళ్లితే 'తుస్' మన్నట్లు చాలా దొడ్డతప్పు వెదికావే? శిరచ్ఛేదన గావింపదగ్గ మహాపరాధమేమో చేసాననుకుంటున్నాను అని అంటున్నారా? యథార్థముగా ఇంతకన్న గొప్ప తప్పేముంది? ఎంతసేపు నీగొడవే నీదికాని అందున్న సాధకబాధకాలు ఆలోచించవు. ప్రాథమికోపాధ్యాయుడు అంటే నీకున్నపాటిగౌరవ మర్యాదలుకూడ నాకు లేవనుకున్నావా? నాక్రింద పనిచేసేవాళ్లని ఆవిధముగా త్రొక్కిపెట్టకపోతే నన్నుకాదు గదా బ్రహ్మనుకూడ లక్ష్యపెట్టరు అంటున్నారా? ఐతే మీపైఆఫీసరు మిమ్ము కూడ ఆవిధముగానే మాట్లాడవచ్చుగా? అదివేరు ఇదివేరు. పాలకపాలితులకుండే వ్యత్యాసము ఉపాధ్యాయులను ఆవిధముగా అణచివుంచకుండా గౌరవమర్యాదతో చూచానా వేరేకొరివితోతలగోకికోనక్కర్లేదు అంటున్నారా? ఐతే ఆవిధముగా చీమలు, జెఱ్ఱులు, ప్రాకినట్లుగా మాట్లాడటమే అవసరము అంటున్నారన్న మాట. సరే గౌరవము అన్నది ఇచ్చిపుచ్చుకునేదేగాని, వాక్కానికి, బంగారానికికూడ, మార్పిడీ పొందని అమూల్యమైనది. అందుకుగాను చెమట ఓడ్చి సంపాదించిన సొమ్మునుగాని, శరీరకష్టాన్నిగాని వీసమంతైనా వెచ్చించనక్కరలేదు. ఎదుటివానిని గౌరవించి, గౌరవింపబడటము అన్నది, ప్రతిపౌరుని సామాన్య ధర్మము. ఎదుటివానిని చీత్కారముగాను, నిర్లక్ష్యముగాను, మాట్లాడినంత మాత్రాన తన గౌరవము ఇనుమడించింది అనుకునే వ్యక్తులు, విద్యాబుద్ధులులేని మోటుజాతి ప్రజల్లోకూడ చాల సకృత్తు. ఇంటతిని, ఇంటివాసాలు లెక్కించినట్లు ఎవరిదయాధర్మమువల్లమీకీస్థితికివచ్చారో వారిని గౌరవించడము అంటే అంతకష్టముగా వుంది కాలవైపరీత్యము ఎంతటికృతఘ్నత!

అసలువాళ్లకెవరికీ కాని ఆమస్టా నీకెందుకంటున్నారా? మాట మాటకు ముఖం చిట్లించుకుంటూ దిబది ఎలతోను, రుసరుసలతోను ఇంట్లో పాచి చేసేగానితో మాట్లాడండి కనబడుతుంది. ఇంతకూ కాలం వెళ్లబుచ్చుకోచూస్తున్న ప్రాథమికోపాధ్యాయలోకం కనుక సరిపోతోంది కాని ఇది ఇంతేనా ఇంకేమన్నా వుందా" అంటున్నారా? ప్రాథమికోపాధ్యాయుల్ని వ్యక్తిగతంగాకూడ నిర్లక్ష్యముగా వుంటమేకాక సామాజికముగాకూడ ఆ విధముగానే ప్రవర్తించుచున్నారు. వింత వింత కేసులు వివిధ సెక్షన్ల క్రింద బనాయిస్తూ అప్పీలుకు కూడా అవకాశములేకుండా చేస్తున్నారు. ఐతే సామాజికముగా ప్రవర్తించుచున్న నాప్రవర్తన మెటువంటిదో వివరించుఅంటున్నారా? ప్రాథమికోపాధ్యాయ సంఘం Teachers' Association సమావేశాలకు మీరు "ఎక్సఅఫిషియో" ప్రసిడెంట్లు ఎంత కాదన్నా ఒక బహిరంగ సభా సమావేశానికి తులతూగుతుంది. సభ్యులుకూడ 50 మొదలు 150 వరకు వుంటారు ఈ సమావేశాలకు ఇన్ని తడవలు ఆధిపత్యాన్ని వహించారు కదా! సదరు సమావేశ కార్యక్రమాలలో పాల్గొనేటప్పుడు ఎన్నడైనా మీరు నిల్చొని మాట్లాడినట్లు జ్ఞాపకముందా? బడిపంతుళ్ల సమావేశాలలో నాలాంటి ఉన్నతవిద్యావేత్తకూడ నిల్చునిమాట్లాడాలా అంటున్నారా? పంతుళ్లసమావేశాలలో చేస్తే చేశారు. ఈ యలవాటును ఇతరత్రా సమావేశాలలో కూడ అట్లానే ప్రవర్తించారు! ఇంతకన్న ఆత్మగౌరవ హీనమైన పని మరొకటుందా? నోరుముయ్యడానికి మూతఉన్నది కాని లోకం ముయ్యడానికి లేదు' అన్నట్లు నావిషయమై ఎన్నిఅన్నా వూరుకొన్నాను. సామాన్యముగా ప్రజలు కూడ ఉపాధ్యాయుని ఆ విధముగా భావిస్తున్నారు కదా. మరి వాళ్లవిషయమో, అంటున్నారా? అందుకుకూడ కొంతవరకు మీరే కారణము. ఉన్నత విద్యావంతులై యుక్తాయుక్త విచక్షణాసామర్థ్యము గలిగియున్న మీలాంటి ఉత్తమపౌరులమూలముగా ఉపాధ్యాయుల గౌరవమర్యాదలు ఇనుమడించవలసినస్థితిలో "కంటిరెప్పవలె కాపాడుతల్లియే విషముబెట్ట కలదెదిక్కు" అన్నట్లు పౌరధర్మాలు గౌరవమర్యాదలు తెలియని సామాన్యుల సంగతి ఎందుకు? తమ్ముతాము ఆత్మపరీక్షచేసుకొండి "ఆవు చేలో మేస్తుంటే దూడగట్టున మేస్తుందా" అన్నట్లు. ఇంతో అంతో మిమ్ములను అనుకరించేవాళ్లు కూడావున్నారు. అందుకని నిర్బంధము ఏమిటి అంటున్నారా? అధర్మము, అన్యాయము, వున్నంతవరకు అరికట్టడానికి ప్రతివారికి హక్కువుంది. మీరేమనుకున్నా సరే. ఒకప్పుడు గొంగళి పురుగావుండి రూపాంతరము బొందిన సీతాకోక చిలుక పూర్వవృత్తాంతమును విస్మరించి, తన అందచందాలను తళుకు బెళుకులను, చూచి ఉబ్బి తబ్బిబ్బయినట్లు మీరూఒకప్పుడు ఆ ప్రాథమికోపాధ్యాయుని అదుపు ఆజ్ఞలలోను, దెబ్బచేతలలోను, వుండే యిప్పటికి ఈస్థితికివచ్చారు. ఆయన పుణ్యమా అంటూ వేళకింత తినకలుగుతున్నాము. నలుగురిలో గౌరవముగా బ్రతుకగలుగుతున్నాము. ఇదేమన్నా పూర్వజన్మవృత్తాంతమా మరచిపోను? నోటికి ఆహారమును అందించే చేతిని

గొరికేరకము! ఎంతసేపయినా తెమిలేటట్టు లేదే అంటున్నారా? అయిపోవచ్చింది. ఒక్కటి బడిపంతులు అనేవాడు ఏవిధమైన అసంతృప్తినీ అగౌరవమును పొందినా అందు వచ్చుచెడుగులు మీవికావు. నావి కావు జాతివి దేశానివి. అంతేనా ఇంకే మన్నా వుందా అంటున్నారా? ఇంతసేపు నిద్రచెడి సావధానముగా విన్నందుకు నమస్కారము. ఈతడవకు చాలులే పడుకోండి- సెలవు

---

మనదేశము, ఆదిమవాసులు, ద్రావిడులు, ఆర్యులు, వేదయుగము

## చ రి త్ర నా ట క ము

[ప్రాథమికబడుల యుపయోగార్థము నూతన సిలబస్ అను కరణము]

(పక్కి అప్పారావు, బోర్డుస్కూలు-ధర్మపురి)

పా ట

సూత్ర॥ హిందూదేశమేకద మనది
హిందూదేశ మాతకువందే॥
హిందూదేశము భారతఖండం
బిడకద భారతదేశం ॥హి॥
ఎత్తగు హిమవత్పర్వతములు
ఉత్తరదిక్కున గలిగీ
తూర్పుదక్షిణ పడమరదిశలా
చుట్టు సముద్రము శోభిలునట్టి

విదూ: బావా! యీప్రార్థన ఎప్పుడు నేర్చినావు? ఆదిని అందరు దైవ ప్రార్థనము చేయుదురుగాని నీవు దేశ ప్రార్థనము చేయడం దివ్యముగా ఉన్నది సుమా?

సూ: ఔను-చక్కని పాడిపంటలు గలిగి, ధనసమృద్ధి నొప్పి, యధికసౌఖ్యదాయి యగు మన జన్మభూమి చల్లగానున్న చక్కని దైవప్రార్థన స్మరణకు వచ్చు ఈబంగారుభూమి నాశించి యితరులెందరో మనదేశముపై దండెత్తి రాలేదా!

విదూ: ఏమీ ఇతరులా? ఉత్తరాన ఎత్తైన కొండలు తక్కిన మూడుదిక్కుల సముద్రము, ఉండగా వారే త్రోవబడి వచ్చినారు?

సూ: బావా! నీవన్నది నిజమే. మన హిమాలయములలో వాయువ్యమూల కైబరు, బోలను అను రెండుకొండదారులుగలవు...

వి: సరిసరి ఇక తెలిసినది. వానిగుండా ఇతరులీదేశమున ప్రవేశించిరి. అంతే కదూ? ఆదిలోనీదేశము నాశ్రయించిన వారెవ్వరో నీవెరుగుదువా?

సూ: చక్కని ప్రశ్న. తొలుత కోలులను కొండజాతివారుండేవారు.

ఆ. వె రాతియాయుధములచేత జంతుల జంపి
పచ్చిమాంసము తిని బ్రతుకువారు
ఇండ్లుగట్టునేర్పు నెఱుగక యడవుల
చెట్లతోర్రల నివసించువారు.

విదు: బావా వారేమైరి?

సూ.

సీ వారికి పిమ్మట వచ్చి ద్రావిడుల్
కోలుల దరిమిరి కొండలకును
ఎందుండి యచ్చటి కెప్పుడు వచ్చిరో
యెఱుగ నాధారంబు లేమిలేవు
వీరి యాకారంబు కారునల్లన పొట్టి
ముఖము బల్లగనుండు బొట్టముక్కు

పాముల చెట్లను భక్తితో పూజింత్రు
బలులు యుద్ధపునేర్పు గలుగువారు
భయ మిడుదేవతల్ పశునరబలు లిచ్చి
గుడిగట్టి పూజించు కొనెడువారు
గీ. జాతిభేదాలు లే విల సాగుచేసి
కొనుట పసుల మేకల కాపి కొనుట వృత్తి
తెలుగు మళయాళ కన్నడములు నరవము
లనెడుభాషల మాట్లాడునట్టివారు
మాంసభోజనమును నేట మంచిప్రీతి.

వి: సరేకాని ఆర్యావర్తము మంచి సార వంతమైనభూమి అంటారు. మన దేశమే కదూ ?

సూ: బావా! అది మన దేశంలో ఒక భాగముగాని దేశమంతాగాదు.

వి: అయితే మన దేశంలో చాలభాగా లున్నాయన్న మాట!

సూ: అబ్బె! మూడుభాగాలే కదూ !

పాట

అందమైనదీ హిందూదేశము
అరయ మూడుభాగములుగ నమరియున్నది
ఉత్తరాన హిమాద్రిభాగమూ
దిగువ నార్యావర్త మనునట్టిభాగమూ
దక్షిణహిందూస్థాన మనగ దనరుచుండును
అందు మధ్యభాగమే యీ యార్యావర్తము

వి: సరిగాని దీనికాపేరెట్లు వచ్చినది ?

సూ: పూర్వము కొంత కాలము ఆర్యులు దీనిని పాలించుటచే దీనికాపేరు వచ్చినది. దీనికే ఉత్తరహిందూస్థానమని మరియొక పేరుగూడ గలదు

వి: ఏమీ ఆర్యులా? వీరెవ్వరు? వీరు దీని నెప్పుడు పాలించిరి ?

సూ: ద్రావిడుల తరువాత వచ్చినవారే యీ ఆర్యులు.

గీ. వీరు విను మధ్యఆసియావారు అచట
పండుపంటలు చాలక పలుతెగలుగ
జీలిపోయిరి కొందరు జేరికొనిరి
సింధుప్రాంతమ్ము ఖైబరుసంధు దాటి.

వి. అయిన అచ్చటి ద్రావిడులోమరి?

సూ. వీరు బలవంతులగుటవలన

వి: సరి ఇంక జెప్పనేల? ఆర్యులు ఆర్యావర్తమును ఆదుకొని, దస్యులవలె దక్షిణమునకు ద్రావిడులను తన్ని తగిలినారన్న మాట!

సూ: అవునుగాని నీవు ఆర్యులకు దస్యులన్న బిరుదు నిచ్చినావు. నీవలె ఆర్యులు ద్రావిడులని దస్యులని, రాక్షసులని, పిలిచేవారుసుమీ!

వి. పాపము! ద్రావిడులకంటె వీరుచక్కని వారు, మంచిగుణములు గలవారు కాబోలు!

సూ: కాకేమి? ఇటువినుము.

సీ. ఆజానుబాహు లాయార్యులు పొడవరుల్
తేజోధికులు చాల తెలుపువారు
కోలముఖమువారు కులభేదములు లేని
వారు సంస్కృతభాష పలుకువారు
పంచభూతములు దిక్పాలురే వీరి దే
వుళ్లు విగ్రహపూజ గుళ్లు లేవు
అరయ దైవ మొకండె అతనిలీలలె సర్వ
మనునమ్మకము గలయట్టివారు
గీ. సాగుచేయుట పశురక్ష సలుపువృత్తి
నాటి ఋగ్వేదపద్ధతి నడచువారు
గాన వీరు చరించిన కాలమెల్ల
వేదయుగ మని యందురు వినుము పిదప.

వి. పోనిమ్ము దక్షిణ దేశమందైన ద్రావిడు నిశ్చింతగాదలదాచుకొన్నారుకదా ?

సూ:-నిశ్చింత మేమిటి? తరచు వారికి వీరికి తగవులు తప్పలేదు.

వి: ఇంకతగవు లెందుకు?

సూ: ఆచారవ్యవహారాల్లో సరిపడక

(తెరలో)

పాట
మరచెనుగా - మంచిదిగా

వి:-ఇంక(జాలించు అదిగో పురుషోత్తమ మహారాజుగారు మంత్రితోగూడ కొలువుకూటమునకు వచ్చుచున్నారు.

(నిష్క్రమింతురు)
(ఇది ప్రస్తావన)

---

## భూగోళ ప్రశ్నోత్తరములు.

(జూన్ సంచిక తరువాయి)

వేదాన్తము శ్రీనివాసాచార్యులు, హెడ్‌మాష్టరు - ఆత్మూరు.

### హిందూదేశవ్యవసాయదారుడు - బర్మా - చైనాదేశము.

12 హిందూదేశమందు వరిపంట యెచ్చట యధికము ?

జ . తూర్పు - పడమరతీరమైదానములు. గంగానదీమైదానము.

13. మనదేశమునకు తూర్పునగల దేశమేది ? అందలిముఖ్యనదయేది ?

జ : బర్మా - ముఖ్యనది ఐరావతి

14. బర్మాదేశపు ముఖ్య ఎగుమతులెవ్వి ?

జ : బియ్యము టేకుకలప.

15. చైనా దేశము యేపరిశ్రమలకు ముఖ్యము .

జ . పింగాణీపాత్రలు, పట్టువస్త్రములనేత.

16. చైనా దేశమందు ప్రవహించు నదులెవ్వి ?

జ. : హోయాంగో-యాంగ్‌ట్సికియాంగ్, సికియాంగు నదులు.

17. ఉత్తర చైనాలో ముఖ్యవృత్తియేమి? చైనా రాజధానియేది?

జ : ఉత్తరచైనాలో ప్రధానవృత్తి పట్టుతీయుట రాజధాని నాన్‌కింగు.

18. మధ్యచైనాలో ప్రవహించు నది పేరేమి? ముఖ్యమగు పంటలెవ్వి?

జ : ప్రవహించునది యాంగ్‌ట్సికియాంగు. నదీముఖద్వారమున షాంగ్‌హై పట్టణము గలదు. ముఖ్యమైన పంటలు గోధుమలు, తేయాకు ప్రత్తి, చెఱకు. ఈ దేశమునకు రాజధానియైన నాన్‌కింగు యీ భాగమున గలదు.

19. హాంకాంగ్‌నుగూర్చి వ్రాయుడు ?

జ : బ్రిటీషువారికి చెందిన రేవు పట్టణము. ఇదియొక ద్వీపముమీద నున్నది. యుద్ధనావలుండుచోటు. చైనాదేశపు విశేషవ్యాపారము యీరేవుగుండ జరుగును.

(సశేషము)

---

## విషయ బోధనయం దుపయోగపడు పద్ధతులు

అరసాడ భానుమూర్తి పట్నాయక్

ప్రాథమికోపాధ్యాయ సోదర మహాశయులారా!

ప్రస్తుత ప్రణాళిక ననుసరించి కొన్ని పద్ధతుల నీక్రింద బొందుపరచియున్నాడను వీనిని మన ఆంధ్ర రాష్ట్ర ప్రారంభవిద్యా బోధకులు గమనించి ఆచరణ యందుంచ గలందులకు ప్రార్థించుచున్నాడను

బోధనాపద్ధతులను మూడు విధములుగా భాగించ వచ్చును అవియేవన 1 వృత్తికేంద్రపద్ధతులు 11 పార్శ్వకేంద్రపద్ధతులు 111 శిశుకేంద్రపద్ధతులు

1 వృత్తికేంద్రపద్ధతి - ఒక వృత్తిని కేంద్రముగ తీసికొని దానిని చేయుచుండగ ఇతరపాఠములు దానితో సంబంధింపజేసి బోధించుట ఉ 1 వార్ధా విద్యావిధానము 11 యత్నములపద్ధతి (project method)

11 పార్శ్వకేంద్రపద్ధతి:- పార్శ్వ విషయమును కేంద్రముగ తీసికొని బోధించుట ఉ. 1 ఉపన్యాస పద్ధతి 11 అన్వేషణ పద్ధతి (Huerastick Method)

111 శిశుకేంద్రపద్ధతి - విద్యార్థిని కేంద్రముగ గైకొని అతని సైజగుణముల ననుసరించి బోధనజరుపుట ఉ:- 1 ఆటపద్ధతులు 11 ప్రయోగాత్మక (క్రియలు) పద్ధతులు (ఒక్కొక్క పద్ధతిని గురించి కొన్ని ఉదాహరణము లీక్రింద వ్రాసినాడను)

1 వార్ధావిద్యావిధానము - ప్రస్తుత ప్రాథమిక విధానము ప్రజలను శాశ్వతాక్షరాస్యులుగ చేయుట లేదనియు, వారికి ఏదేనియొక వృత్తియందు తగిన శక్తిపాటవ మీయలేదనియు, ప్రాథమిక విద్యవలన ప్రజలేమియు లాభము పొందలేదనియు, గ్రహించి కొందరు విద్యావేత్తలు ప్రాథమిక విద్యాప్రణాళికను మార్పుచేయుట కాలోచించిరి

మహాత్మాగాంధీగారి ఆలోచనపై వార్ధాయను పట్టణమునొద్ద ఒక ఉపసంఘము నేర్పాటుచేసి అందు విద్యావిధానము మార్పును గురించి ఆలోచించిరి ఆసంఘమునకధ్యక్షులు డాక్టర్ జకీరహుస్సేన్ గారు. ఆసంఘములో భారతదేశములోని వివిధ ప్రాంతములనుండిన విద్యావేత్తలు సభ్యులుగా నుండిరి వారు కొన్నిదినములు దీర్ఘాలోచనలుచేసి ఈ దిగువ తీర్మానములను స్థిరపరచిరి (ఆతీర్మానములలో ముఖ్యమని తోచినవానిని వ్రాసితిని)

1 ప్రాథమిక విద్యను ఉచితముగను, నిర్బంధముగను నేర్పవలెను.

11 నిర్బంధవయస్సు 7 సం|| 14 సం|| వరకు

111 ఏదేనియొక వృత్తిని కేంద్రముగ పెట్టుకొని దానిద్వారా పాఠములన్నియు బోధించుచు ప్రాథమిక విద్యపూర్తియగు సరికి ఆవృత్తియందు జీవనోపాధి చేర్పరచుకొనుటకు తగిన ప్రావీణ్యము నీయవలయును

1V ప్రస్తుతము స్కూలుఫైనల్ వరకు ఇంగ్లీషు చెప్పుచుగిలిన విషయములయందు జ్ఞానముకలుగ జేయవలయును

V మాతృభాషయే, విషయ బోధనకు వాడవలయును

V1 బాలురు తయారుచేసిన వస్తువులనమ్మి ఆసొమ్ముతో విద్యకొరకయ్యే ఖర్చును కొంతవరకు భరించవచ్చును

V11 అహింసావ్రతమును ఆచరణలో పెట్టవలయును

V11 ఈపద్ధతిని బోధించుటకు వీలుగానుండు కొన్ని వృత్తులు 1 నూలువడకుట నేయుట, వ్యవసాయము, మొదలగునవి సూచించియున్నారు

వార్ధా విద్యావిధానమునందు గణితమును బోధించుట ఎట్లు? (నూలువడుకుటపై)

సంఖ్యాజ్ఞానము - ఏకులను లెక్కించుట, పదుల చొ|| కట్టలు కట్టుట (10 × 10=100) ఏకుల కట్టలను ఒకనూరుకట్ట కట్టించుట

సంకలనము:- 10 ఏకులలో 5 ఏకులు కలిపిన ఎన్ని అగును? 10 ఏకులుగల కట్టలు 2 గలవు వానిలో గల మొత్తము ఏకులెన్ని? ఈ మొదలగు విధముల వలన సంకలనము చెప్పవచ్చును.

వ్యవకలనము -20 ఏకులలో 10 ఏకులు వడికితిమి మిగిలిన ఏకులెన్ని?

గుణకారము -ఒక్కొక్క బాలునకు 4 ఏకులు చొ|| 6 గురికి ఎన్ని కావలెను?

భాగహారము -10 ఏకులను 5 గురు వడికిరి ఒక్కొక్కడు ఎన్ని వడికెను?

మిశ్రమగానులు -ప్రత్తిని కొనుట, బట్టలనమ్ముట మొదలగు వానివలన ద్రవ్యగానము, లాభనష్టములు చెప్పవచ్చును

కొలతమానము -కొలత ప్రమాణములయొక్క పరిచయమును, తయారైన దారమును, బట్టలను, కొలుచుటయందు కలుగజేయవచ్చును.

తూకములు:- ప్రత్తిని, దూదిని, తూచుట, దారమును తూచుట మొదలగు ఘట్టములలో తూనిక విషయములు చెప్పవచ్చును

సరాసరి:- 1 దినములోగాని, 2, 3 దినములలోగాని వడికిన దారమునుగాని, నేసినబట్టనుగాని, గంటకుగాని, దినమునకుగాని, ఎన్నిగజములు పని జరిగినదో తెలుపుట.

శాతములు:- ప్రత్తిలో దూది ఎంతశాతముండును? తూచినదానికిని దూదినివడుకగా వచ్చిన దారమునకును తేడా ఎంతశాతముండునో తెల్పుట

భిన్నములు:- దూదిలో వంతులు, నేసినబట్టలో వంతులు, మొ॥ చెప్పుట

చదరపులెక్కలు:- నేసినబట్టయొక్క పొడవు, వెడల్పు, వైశాల్యము మొదలగునవి చెప్పవచ్చును. ఇట్లే వడ్డీ తదితరలెక్కలు చెప్పవచ్చును.

(మిగతా రాబోవు సంచికలో)

సరా:- వృత్తిని కేంద్రముగ తీసికొని గణితము నెట్లు బోధించవలయునో పైనుదహరించినాడను. పై అంశములు కొద్ది కొద్దిగా ఉదహరించినాడను. వానిని ' విపులతరముచేసికొని ఆచరణయందుంచుదురని సోదరులను వినమ్రతతో ప్రార్థించుచున్నాడను.

---

## వి హ గ ప రి తా ప ము

### చిలకా వేంకటకృష్ణదాసు

1. మంజులారామభూముల మసలుచుండి । మధురఫలముల భక్షించి మధురజలము
గ్రోలి జీవించునట్టి మాజోలికేల ? । వ్యాధుడా! యెద కరుణ రవంత లేదె ?
2. పిల్లగాడ్పులు వీవగ నల్లమందు । నింపు రేకెత్త కంఠము లెత్తి మధుర
గాన మొనరించు చుందుము వీనులలర । ఏమిహాని గ్గొనర్చితిమి? బాధింప నీవు.
3. గడ్డిపరకల చిదుగులం గట్టినట్టి । చెట్టుపై గూటియందున చింతలేక
వాస మొనరింతుమేగాని భవనములను । పూలపాన్పుల వాంఛింపబోము శబర !
4 పరుల కుపకృతి నొనరించు పాదపముల । నీలమేఘాల సెలయేళ్ళ నెయ్యమంది
విశ్వమున్ బరికించుచు వివిధగతుల । యానమున్ జేయుదుము పవలంత మేము.
5. జంటజంటలుగా నుండి సంచరించి । ప్రేయసీప్రేయసుల కతిప్రేమతోడ
పరమదాంపత్యధర్మము వదలకుండ । మనుచటం జెరిగింతుము మహితకరుణ
6. పిండివంటలు ఫలములు దండిగాను । భక్షణము సేయరాదె! మాపలలమునకు
కరుణ విడనాడి మమ్ముల కటకటమ్మ । లకును బలిజేయ న్యాయమా నరకరినాత్మ!
7. నారి సారించి శరము లానందమునను । విడిచెదవు మమ్ము గాఱింప; నేయలేవు
నీదుప్రాణము గొను జముని పయి; నీ పరిశ్రమంబది వృథగాదె, మృదయ! తలప
8. కోల వేయంగ గిజగిజ కొట్టుకొనగ । కాల్వలై పాఱు రక్తంబు గాంచియైన
నించుకంతయు పొక్కవు; మృగయుడా! త్వదీయచిత్తము కఠినంపు రాయియెమొ?.
9. ఉరులు పన్నెద వేలకో యుసురుదీయ! । నీదు సొమ్ములగొంటిమా! నీకుటుంబ
మునకు హాని యొనర్పంగం బూనినామొ? । చేతు లెట్టువచ్చె మమ్ముల శిక్ష సేయ?
10. నీదుప్రాణ మొరులు దీయ నీవుగువయు । బిడ్డలున్ జుట్టముల్ విలపింతురుగద !
అట్టులే మాదుజీవితము చెఱుంగు । బుద్ధి నీ కేలలేదోయి? బోయవాడ!,

11. కవుల సద్గ్రంథపాళిలో గడచె కొన్ని | గాయకాళికి గురువులమై యలరియు
భూరికీర్తి నార్జించెడి వారమయ్య | వ్యాధునకు మాత్ర మేలకో పరులమగుట.
12. పక్షిజంటలు ప్రేమతో బాడుచుండ | నకట! గత భవంబున కిరాతకుల మాచు
నసురులం దీసినా మెమెయ్! నొసటిపైని | యిట్టిదారుణమ్మృతి లిఖియించె బ్రహ్మ.
13. ఇనుడు తూరుపుదెస నుదయింపక మున్నె | వందిమాగధులటు నిన్ను పాటపాడి
నిద్ర మేల్కొల్పినందుకు నీవొసంగు | పారితోషికమా! యిది క్రూరచిత్త!
14. ఆర్యవిరచిత వేదవాక్యంబు లేదది? | బుద్ధవర్ధమానుల మహాబోధ మేది?
గాంధిదేవుని సిద్ధాంతగరిమ మేది? | యెల్లశాస్త్రార్థ మేది? యహింస యొకద.
15. హింస చేసిన పాప మెంతేని గలుగు | పెద్దవారలనుద్దుల్లు పెరుగుకూడ
మాటయని గ్రహింపుచు నిక ముందునుండి | భూతదయ గల్గి సత్కీర్తి బొందు
మోయి!

---

# ప్రాథమిక పాఠశాలల అనాచారములు

రచయిత: డి. యస్. మూర్తి ఆచార్య, టీచరు, ఎ. యు. ఎస్.

నేను ఎన్నోసార్లు చూచి యిట్లా వ్రాసినానుగాని అనుభవం లేకుండా కాదు సుమండీ! నా సహోపాధ్యాయులు యీ విషయాన్ని గూర్చి ఏవిధముగా తీసుకున్నా మంచిదే.

మన స్కూళ్ళలో 75% మీది నామమునకు చెందినవే. టీచర్సు తగిన శిక్షను (Discipline) బాలురకు యివ్వడం మానినారు. దానితో వారిలో వారికి హేయ భావము కలుగుతుంది. తదుపరి టీచరుకు కూడా గౌరవం తగ్గుతుంది. అటుపైని స్కూలు నీచస్థితిలో వుంటుంది, అందుచేతనే మొదటినుండి కూడా ప్రాథమిక పాఠశాలలలో జరిగే అనాచారములను రూపుమాపడానికి ఉపాధ్యాయుడు పూనుకోవాలి. అదెట్లాఅంటే: పాఠశాల గ్రామమునకు సాంఘిక కేంద్రమైయున్నది. అందుచే టీచరు విద్యార్థులకు జ్ఞానము కలుగజేయాలిగాని తీరికగా స్కూలుపని చేయుచున్న కాలములో ఇతరులతో ఎక్కువగా ఇష్టాగోష్ఠి సలుపరాదు. టీచరు సద్గుణములు, సదభ్యాసములు కలిగిన, పిల్లలు (Pupils) ఆ విధంగానే తయారు అవుతారు. కాని దీనికి పిల్లల తలిదండ్రులుకూడా వారి పిల్లల సత్ప్రవర్తనకు తగిన సలహాయిచ్చుచూ ఉపాధ్యాయునకు ఎక్కువగా సహాయంచేయాలి. మన దేశములో తలిదండ్రులకు పాఠశాలయెడ శ్రద్ధతక్కువ. దీనికికారణము విద్యావిహీనతయే. విద్యాభివృద్ధికి-పాఠశాలాభివృద్ధికితల్లిదండ్రుల సహాయ మవసరము. ఈ విషయంలో ఉపాధ్యాయులీ క్రింది ఏర్పాట్లు చేయాలి. విద్యార్థుల అభివృద్ధి రిపోర్టులను తలిదండ్రులకు పంపాలి. తల్లిదండ్రుల సంఘములను (Parents' Associations) స్థాపించి పాఠశాలాభివృద్ధి మార్గములను వారితో చర్చించాలి. టీచరు అప్పుడప్పుడు వ్యాయామ ప్రదర్శనములు,

పోటీపరీక్షలు, ఉత్సవములు, డ్రామాలు, వేయించి తల్లిదండ్రులను పాఠశాల జీవనములోని కాకర్షింపచేయాలి సంవత్సరమున కొకసారైనను పాఠశాలా వార్షికోత్సవము జరిపి పలువిషయములలో పోటీలుపెట్టి పిల్లలకు బహుమతులు తలిదండ్రుల సమక్షమున యిచ్చినవారికి బడివలన కలుగు ప్రయోజనములు తెలిసి టీచరులందును, పాఠశాలయందును, ఆదరణ కలుగును పిల్లలచే తయారైన పటములు మొదలగునవి తలిదండ్రులకు చూపెట్టాలి. ఇప్పటి విద్యార్థులలో తగు శిక్ష (Discipline, నీతినియమము, పెద్దల యెడ భక్తి గౌరవములు, మొదలగు సుగుణములు చాలా అరుదుగా కనబడుచున్నవి. దీనికి విద్యావిధానము, ఉపాధ్యాయులు, కారణమును, బాధ్యులు, అయివున్నారు పై విషయములన్నియును గల ప్రాథమిక పాఠశాలలలో అనాచారములు ఉండనేర్వవు. ఇట్టివి యింకా చాలా వున్నాయి గాని తక్కువంగల విషయాలు పేర్కొనిన ఉపాధ్యాయులకు తప్పకుండా నాపై ఆగ్రహము కలుగుతుందని ఇంతటితో విరమిస్తున్నాను

"అందరిని సంరక్షించేవా డాపరాత్పరుడే." ఇప్పటికి సెలవు.

---

# ఓ పేదపంతులయ్యా!

రచయిత . ఘంటసాల దుర్గాప్రసాదరావు

మనసు చెవరెని పెన్నిధి మాయమైన । లోభిచందాన దిగులొంది లోన గుందు
చుంటి నదియేమి? చూడలేకుంటినిన్ను । ఓయ భాగ్యని న్నూరార్చు యోగ్యుడెవడు.

* * * * *

కట్టుకొన నీకు కొల్లాయి కఱవుగాగ । కడుపు నిండించు గంజియే కఱవుగాగ।
క్షామదావానలంబు నిన్ గాల్చుచుండ । నార్చు నెవడు రాడోయుపాధ్యాయవర్య.

* * * * *

'బువ్వ! బువ్వం'చు బిడ్డల బాగులుచుండ । నార్తిమై వేసికన్నీటి నావివిడువ
హృదయవిచ్ఛేద సంతాప మిూడ్చుచుండ । నెట్లు దిగమ్రింగి సాగెద వేదివెఱవు?

* * * * *

భావిపౌరవిజ్ఞానంపు వసతిగృహము । కట్టుభారము నీపైన కలదు గాని,
కర్మ మదియేమొ దేవునికరుణ సుంత । లేనిజన్మమ్మ్యో నీజన్మ దీనజనుడ !

* * * * *

తుత్తు నార్పనియధికార్లు కూకలిడగ । మానముద్రికస్వామివై మసలె-దౌర
పిల్లవారల తలిదండ్రు లుల్లమునియు । బల్కు చిత్తమటంచును బలికె దీవు
ఎంత యోదార్పునేర్పె నీవృత్తి యౌరా?

* * * * *

ఆలిబాధకు బాలురయార్తరవము । తోడుగా క్షామదావాగ్ని గోడుగూర్ప
స్వల్పవేతన మధికార్లసాగదీశ । నిన్ను శల్యావశిష్టుగా నిగడ జేసె.

*　　*　　*　　*　　*

ఎన్నటికి నీదుకష్టంబులెల్ల సమయు । నెపుడు నాట్యంబు లక్ష్మినీయింట త్రొక్కు-
నప్పుడే రత్నగర్భాఖ్య సార్థకము । భారతాంబకు నో పేదపంతులయ్య !

---

# ఉపాధ్యాయ లోకమున కొక విజ్ఞప్తి

యన్. శ్రీకంఠ సత్యనారాయణమూర్తి.

ప్రియ సోదరీ సోదరులారా !

బాల బాలికలనుపెంచి క్రమశిక్షణ యొసంగి భావిసత్పౌరులజేయు బాధ్యత తలిదండ్రులమీాదనేగాక మనయందుగూడా గలదను విషయము మనకు తెలియనిదికాదు. కాన మనము జీవితములోని అన్నిస్థితులయందును అత్యంతావసరమగు సంతోషమును బాల బాలికలకు చిన్ననాటనుండియే పొందుటకు అవకాశము గలుగ జేయవలయును. ఇందులకు అత్యుత్తమ సాధనమేమన మనము వారికి దయతో గూడిన చిరునగవును గనపఱచుచుండుట, కోపదృష్టిని సంపూర్తిగా వదలుట, వారితో మనోరంజకములగు మాటలు పల్కుచుండుట వారికి సంతోషదాయకమగు విషయములలో సాధ్యమైనంతవరకు అభ్యంతరపెట్టకుండుట - అభ్యంతరము చేయు విషయములపట్ల అందుకు తగిన కారణములను శాంతముతో వారికి తెలియజేయుట - మొదలగునవి - మనలోని చాలామంది సోదరీ సోదరులకు పిల్లలను కఠినముగా దండించుట అలవాటు అయిపోయినది. పై అధికారులు వలదని ఆక్షేపించినను, పిల్లల తలిదండ్రులు ఉపాధ్యాయుల యెడ విసుగుకొన్నను, తుదకు పోట్లాటలు సంభవించినను, తమ చిరకాలపు దురలవాటగు పిల్లలను కొట్టి బాధించుటను మాత్రము వదలజాలకున్నారు ఇట్లు క్రూరముగ దండించు పాఠశాలలయందలి పిల్లలు విద్యాలయము వదలగనే స్వేచ్ఛానందమును పొందుచున్నారు ప్రత్యక్ష నరక కూపములని పాఠశాలలను భావించుచున్నారు.

కాని మనము యథార్థముగా పిల్లలయెడ గనపఱుపదగిన ప్రేమనే ప్రకటించినచో వారు తమస్వేచ్ఛానందసమయములను సంపూర్ణముగా పాఠశాలయందే బడయుచుందురు. సహజప్రేమగల అట్టి యుపాధ్యాయుల వియోగమునకు బాలురు వగచుచుందురు. కాన యుపాధ్యాయుడు బాల-బాలికలకు ఆనందము చేకూర్చు వాడుగనే యుండవలయును గాని హింసచే బాధించువాడుగా నుండరాదు.

పిల్లలను కొట్టు ఈ దుష్టపద్ధతిని పూర్తిగా మాన్ప ప్రచారముచేయు నుద్దేశ్యముతో మన భారత దేశమందు పిత్రూపాధ్యాయ సమితి (League of Parents & Teachers) అను నొక సంఘమును 25—12—1915 తేదీని స్థాపించినారు.

## దీని ముఖ్యోద్దేశ్యములు

1. గృహములందును, పాఠశాలలందును, పిల్లలను కొట్టు పద్ధతిని పూర్తిగా మానుట; మాన్పించుట.

2. బాల బాలికలను తరిబీతుచేయు విషయములో తగు సూచనలను ఉపాధ్యాయులకును, తలిదండ్రులకును, తెలియజేయుట.

## సభ్యత్వము

పై యుద్దేశ్యములను తెలియజేయు ప్రమాణపు కాగితము చేవ్రాలు చేసిపంపిన మాత్రముననే సభ్యులుగా పరిగణింపబడుదురు. ఈ సమితియందు ఉపాధ్యాయులు తలిదండ్రులేగాక, ఇతరులుకూడా సభ్యులుగా నుండవచ్చును ఈ సమితిలో చేరువారందరును మొదటియుద్దేశ్యముగల ప్రమాణమునకులోబడుదురని తలచబడుదురు. కాని ఉదారులగు సభ్యులు సమితియొక్క ఉద్దేశ్యములను ప్రచురించుటకును, కరపత్రములు చిన్నచిన్న పుస్తకములు, ప్రచురించుటకును - దానము ఇచ్చినయెడల, కార్యదర్శులు, ప్రచారకులు కృతజ్ఞతతో తీసికొందురు.

ఇతర వివరములు పూర్తిగా నెరుగగోరువారు ఈ క్రిందివారలకు వ్రాసిన బడయగలరు.

* అఖిలభారత గౌరవ కార్యదర్శి :
  ప్రొఫెసర్ ఆర్. కె. కుల్కర్ణి, M.A. L.LB. గ్వాలియర్.
* దక్షిణభారత కార్యదర్శి :
  శ్రీ యస్. వి. ఖాండేకర్ గారు, దివ్యజ్ఞాన సమాజము, మదరాసు.
* ఆంధ్రరాష్ట్ర ప్రచారకుడు :
  ఆంధ్రవీర పరిగె వేంకటరమణరావు పంతులుగారు, F. T. S. B A , B.Ed.
  గురజాల, గుంటూరుజిల్లా. S. D. I.,

**గమనిక :—**

ఇట్టి సంస్థలు ఉపాధ్యాయలోకమునకు అత్యంతోపయోగములు. అన్నిజిల్లాలయందును, అన్ని తాలూకాలయందును, ఈ పితూపాధ్యాయ సమితిశాఖలను స్థాపించి లోకకల్యాణముకొఱకు పాటుపడుటకు తగిన అవకాశములను. శక్తిసామర్థ్యములను. ఉపాధ్యాయ ఉపాధ్యాయినీలకును, తలిదండ్రులకును, పరమ పురుషుఁడు ఒసంగుచుండుగాక ! నమస్తే

విన్నవించు ఉపాధ్యాయ సోదరుడు,

శ్రీకంఠ సత్యనారాయణమూర్తి,

శ్రీ వేంకటరమణా థియోసాఫికల్ హిందీ & తెలుగు ప్రాథమిక పాఠశాల,

గుళ్ళదూర్తి, కోయిలకుంట్ల పోష్టు, రాయలసీమ.

## చేనేత (పాట)

వి. గోపాలరావు & టి. సన్యాసిరాజు, విజయనగరం.

పల్లెయు పట్నం బనకండి
ప్రతియింట రాట్నముంచండి
ప్రత్తిమొక్కలను పెంచండి
ప్రత్తిని యేకులు చేయండి
ప్రజలారా! యేకులనుండి
సన్నమైన నూల్వడకండి
వస్త్రములను నేయించండి
వాటిని సదా ధరించండి
భరతఖండమున చేనేత
పరిశ్రమను బలపరచండి

---

## ఆరోగ్యము (పాట)

ఆరోగ్యమే.... నీభాగ్యము
ఆరోగ్యమును సదా - కోర మేలా నీకు॥ ఆ॥
నిర్మలంబగుగాలి - నీవు పీల్చుట యనెడు
ధర్మంబు మది నెఱిగి - నిర్మలుండవు గమ్ము॥ ఆ॥
పరిశుద్ధజలముచే - పానంబు చేయుమా
మురికినీటిని నీవు - ముట్టరా దెన్నడును॥ ఆ॥
ఆహార మతిస్వచ్ఛ - మగునదియె భుజియించు
అమితభోజనమునకు - నలవాటు పడరాదు॥ ఆ॥
దినదినము వ్యాయామ - దీక్షఁ బూనగవలెను
తనువునన్ రోగంబు - లను జేరనీయకుము॥ ఆ॥
పవలెల్ల పనిపాట్లఁ - బడ్డ కష్టములకును
దేవుని స్మరించి ని - ద్రించుటయె విధి నీకు ॥ఆ॥

---

### చందాదారులకొక మనవి.

మా చందాదారులు తరుచు పత్రిక చేరుటలేదని వ్రాయుచున్నారు. మా కార్యాలయమున యివి జాగ్రత్తగా వ్రాసి పోస్టు చేయుచున్నాము. పత్రికలు చేరని వారు ముందు వారి వారి పోస్టాఫీసులలో కనుగొని తరువాత మాకువ్రాసిన మేమును కనుగొందుము.

ఇట్లు,
వ్యవస్థాపకులు.

# ధర్మము

(సింహా).

మానవుడు నిద్రించునపుడు గూడ ఉఛ్ఛ్వాస నిశ్వాసములు నిలువవేరవు ఇది ప్రకృతి ధర్మము. అట్లనే ప్రతి మానవుడు తన పనులను తాను ఫలాపేక్షలేక నిర్వర్తించుట వానిధర్మము. లౌకిక బుద్ధిని, మాటలవలన తనధర్మమును తప్పిపుచ్చుట ఆత్మద్రోహమనబడును. ఆత్మద్రోహము బాహ్యమున కగోచరమైనను సర్వాంతర్యామి యగు సర్వేశ్వరుని మండట నంతయు నవగతమే. అందున పాపమునకు శిక్షవిధించుట సర్వేశ్వరుని ధర్మము. దండనాధికారిదైవమైనను సత్యము పాటించు పరమ దయాస్వభావుడతడు. ధర్మమును గుర్తించినవాడే మహానుభావుడు, లేనివాడే విధివశమని ఉదాసీనత పొందును. ఇది అజ్ఞానధర్మము.

జ్ఞానాజ్ఞానసమ్మిశ్రజనితకాలము మార్చుట కాల ధర్మము. అందును ప్రస్తుతపు మార్పు యుద్ధ ధర్మము. యుద్ధధర్మమునకు పునాదిని గుర్తింప దలచుట గతజలసేతు బంధనము. వర్తమానమును దీని నాధారపఱచుకొని భవితవ్యము గుర్తించుట మానవుని ప్రస్తుతధర్మము. ఈ ధర్మమును గుర్తించి తగు ఏర్పాట్లు పైని భద్రత వహించుట శ్రీ గవర్నమెంటువారి ధర్మము. గవర్నమెంటువారు భద్రత వహించునపుడు వారి నాశ్రయించి నౌకరీచేయు ప్రతి వ్యక్తిని రక్షించుటకూడ వారి ధర్మమే! వారి ధర్మమునువారు నిర్వహించినందున పూజార్హులని చెప్పుట ప్రజల ధర్మము. గవర్నమెంటు నౌకరీదారులీ యుద్ధపు కఱవుకాలమున భుక్తి లోపము లేక సుఖించుట వారి పుణ్యధర్మము. ప్రజలు భుక్తి శాస్తియనియు, దేహీయనియు, తహతహలాడుట వారి ఆత్మద్రోహపు పాపధర్మము.

ఆదిపురుషుడగు సర్వేశ్వరుడు పాపపుణ్యఫలముల విచారించుటకు తానొక్కడే పూనుకొనిన సృష్టిలో ప్రమాదములు సంభవించునని సృష్టి స్థితి లయములకొరకు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను, దండనాధికారి యమధర్మరాజులను నియమించుకొని తన పరిపాలనా ధర్మమును నిరూపించెను. అట్లనే శ్రీ గవర్నమెంటువారును, విద్యాశాఖకు పాలకవర్గము శ్రీ బోర్డువారును; వారిధర్మమేమి ఉపాధ్యాయుల కన్నము లేకుండ చేయుటగాదే! ఉపాధ్యాయులు కేవలము శ్రీ గవర్నమెంటువారి నౌకరులునుగాక, ప్రజలునుగాక, మధ్య త్రిశంకుని వలె నుండిరి. త్రిశంకునికైనను శాపవిమోచనము గలుగగల ధర్మముండినది. ఉపాధ్యాయున కదికూడ లేదా? శ్రీ బోర్డువారు వారి ధర్మమును వారు గుర్తించికాని, దానికిది సకులగునపుడు సర్వాధికారులగు గవర్నమెంటువారు సరిపుచ్చికొని దయ చూపుట వారి ధర్మము కాదా? లక్షాధికారైన లవణమన్నమె. అందున అన్నము కొరత ఏర్పరచుట ఏలికకు ధర్మముకాదు. పైగా మానవధర్మ విరుద్ధము. పోనీ జీతములైన అధికమా? కల్ల. ఇంక్రిమెంట్లో? ఎచ్చటనున్నవి? కరవుభత్యములా? తలపెట్టరాదు. అధికారము? కలలోనైన భ్రాంతి కొనరాదు. ఇకనున్నది? కడుపుమంట. అన్నమో రామచంద్రా! శరణు!! శరణు!!! "అన్నము పరబ్రహ్మస్వరూపము" పరబ్రహ్మమే పరమ సుఖము. అన్నమే జీవిత సుఖము. బోర్డువారు వారి ధర్మమును పరిపాలించువరకు ఊరకుండుట ఉపాధ్యాయుల ధర్మమా? అన్న మందరిమానవులకు ముఖ్యముగుడు ఉపాధ్యాయుల క్షుధను ఊహించుట బోర్డువారి ధర్మమా? కాదా? యింటియజమాని ప్రతివాడు అడిగినపుడే సరిపడుబియ్యము కొనునా? కల్ల! అట్లనే మాకిచ్చు జీతనములు, కుటుంబ సంఖ్యలు, తట్టుబడి చూచి ఉపాధ్యాయులకన్నము చేకూర్చుట ఉపాధ్యాయు మేనేజిమెంట్ల ధర్మమని నమ్మగలను. ఏల? ఏయుపాధ్యాయుడూ ఆగ్రామ జన్మస్థానవాసిగాడు. పూర్వకాలవేతనపు నౌకరగుడు ప్రజల మొగమాటము తక్కువ. దానికేమి? ప్రజలకే అన్నముకొరత సప్లయిచాలదు. ఉపాధ్యాయునికి సానుభూతినైన ఎట్లు చూపగలరు? ధనమూల మిదంజగత్తు. ఇక ఉపాధ్యాయునికి బియ్యమెట్లు?

ఇంత తర్కించినపైన శ్రీ మేనేజిమెంటువారి తటస్థతకు, ఉదాసీనతకు, కారణముండకపోదు. వారు కూడ సర్వాధికారులు కాకపోవుటచే మాట చెల్లగల అధికారము తగ్గియుండవచ్చు. కాని

సర్వేశ్వరునివలె సర్వాధికారులు శ్రీగవర్నమెంటు వారు పాక్షికముగ వ్యవహరించుట అధర్మమగును. ఉపాధ్యాయవృత్తి మాత్రము "ఎస్సెన్షియల్" అనుట ధర్మము గాదా? అటులైన వారి నౌకరులవలె వీరికి కూడ బియ్యము సప్లయి చేయుట వారిధర్మము. వారి నౌకరులందరు ప్రత్యేక ప్రత్యేక దరఖాస్తులు పెట్టినపైని ఇచ్చిరా? వారి ధర్మమును వారు నెరవేర్చిరి. నామమాత్రపు శాఖాభేదము వలన శ్రీ గవర్నమెంటువారు కూడ ఉపేక్షించిన వీరి బ్రతుకెట్లు? దినమంతయు బియ్యపు సేవరేయైన బడిసేవ యెప్పుడు? సేవలేకున్న దండనపొందుట తప్పదు. దండించుట అధికారి ధర్మము. సేవ చేయుట వీరి ధర్మము. చేయించుకొనుట వారి ధర్మము. ఇట్లింతకాలము బోర్డువారును, శ్రీ గవర్నమెంటువారును, కదలిక చూపకుండుట తగు ఏర్పాట్లు జరుగుచున్నవని నమ్ముట ఉపాధ్యాయుని ధర్మమా? స్వత్వమును మరపించుట దారిద్ర్య ధర్మము. భీతిని ఊరకుండినచో ఆత్మద్రోహము ఉపాధ్యాయునియందు పట్టును. "అడుగనిదే అమ్మ యైన అన్నము పెట్టదందురు" కాన ఓ యుపాధ్యాయులారా! ఏలమౌనముద్రవహించి నిద్రించెదరు? మీరు ముందుగ మేల్కొనుడు. యూనియనులను మేల్కొల్పుడు. మీ ధర్మమును మీరు గుర్తింపుడు. ఆందోళన చేయుడు. ఏడ్చినదాని భర్త వచ్చిన నా భర్తకూడ వచ్చునను భావమును వీడుడు. మీ ఆకలిబాధను తీర్చుకొనుడు. ఇతరుల కుపకారము చేయుడు. "కోమటిపాట" అని తలపకుడు. ధైర్యము, పట్టుదల, దీక్ష వహింపుడు, మన ధర్మమును మనము చేయుదము. అచటికి విఫలులమైన మనమాత్మద్రోహ ధర్మబద్ధులమే!

"ధర్మమేవ జయతి"
ఓం తత్సత్.

---

# ఉచిత విద్య

(ఉచితభోజనము కూడా యివ్వబడును)

విద్యాభిమానులారా!

ఈ గ్రామములో హాయ్యర్ ఎలిమెంటరీ సిలబసు ప్రకారము 1 మొదలు 8 తరగతుల వరకు విద్య నేర్పబడుచున్నది. 7—14 సంవత్సరముల లోపలనుండు ఆది ఆంధ్ర, మాల అనాధ బాలికలకు ఉచిత భోజన సదుపాయము లొసంగి విద్యా ప్రబోధము గావించుటకు తగినవనతు లేర్పాటు చేయబడినవి. కాబట్టి విద్యాభిమానులెల్లరు మా ప్రయత్నములకు తోడ్పడి తమ బాలబాలికల ప్రోత్సాహపరచి పంపుటయేగాక, అన్ని తెగలవారి బాలబాలికలగూడ పంపునట్లు చేయగలందులకు మిక్కిలి వేడుచున్నాను.

రామగోవిందాపురం
(కనిగిరి తాలూకా)
ది 1-7-1943

ఇట్లు,
మూరెళ్ళ కృష్ణయ్య
మేనేజరు.

# అనకాపల్లి తాలూకా ఎయిడెడ్ ఎలిమెంటరీ పాఠశాలల టీచరు మేనేజర్ల సంఘసమావేశములో గావింపఁబడు తీర్మానములు

1 ప్రాథమిక ఎయిడెడ్ ఎలిమెంటరి స్కూళ్ళలో సెకండరీగ్రేడుపాధ్యాయులు ఆస్థిరముగా పని చేయుటచేతను, వారు ఎయిడెడ్ స్కూళ్ళలో పనిచేయుటకు తరముగా ఆమోదించకపోవుటచేతను, వారికి లోకల్‌బోర్డ్సు ఎయిడెడ్‌స్కూళ్ళ స్కేలుకంటె అదనముగా దొరకుటచేతను, ట్రెయినింగుకాలములో స్టయిఫండు లేకపోవుటవలన ట్రెయినింగు పొందినవారి సంఖ్యయే తక్కువగా నుంచుటచేతను. యుద్ధనిర్వహణకార్యములలోచాలమంది చేరుటచేతను, మగ్గురుపాధ్యాయులుపనిచేయు ప్రాథమికపాఠశాలలకు హాయ్యరు గ్రేడువారే హెడ్మాష్టర్లుగా ఉన్నారు గనుకను, ప్రాథమికపాఠశాలలకు హాయ్యరుగ్రేడు వారు తగుదురు గనుకను సదరు సెకండరీవారి నిబంధన తొలగించుచు హాయ్యరుగ్రేడువా రాపనిని పూర్తి జేయుటకును ఆమోదించవలసినదని కోరిరి.

2. పదిసంవత్సరములు సర్వీసుయున్నటువంటిన్ని తమ జీవితము సదరు స్కూళ్ళ కర్పించుచు నమ్ముకొనియున్న ట్రెయినింగుకాని ఉపాధ్యాయులకు ఆయాగ్రేడుల ట్రెయినింగు పరిక్షకు ప్రయివేటుగా కట్టుకొని ప్యాసగుటకు అనుమతి నీయవలసినదని కోరిరి.

3. సర్వీసు రిజిష్టరువిషయములో ఫెలాసా ఫారము కాపీ ఇన్స్పెక్టరువారి ఆఫీసునకు చేరినది లగాయతు సదరుపాధ్యాయునకు గ్రాంటు రికమెండుచేసి ఆ క్వార్టరులోనే గ్రాంటు యిప్పించవలసినదనికోరిరి.

4. లోకల్ బోర్డ్సులో ఏయేగ్రేడుల పరీక్షపొందిన ఉపాధ్యాయులను ఆయాగ్రేడుల ఉద్యోగములలోనే నియమించునట్లు ఏర్పాటు చేయవలసినదని కోరిరి.

5. స్కూలుప్లేశ్ 9½ చ॥ అ॥ విస్తీర్ణమునుండి 7½ చ॥ అ॥ విస్తీర్ణమునకు తగ్గింపు ఏర్పాటు చేయించవలసినదని కోరిరి.

6 ది 15-12-39 కి పైగా రికగ్నిషను పొందిన ఎయిడెడ్ స్కూళ్ళలో 50% కొలువులో శాలికలు విధిగానుండవలెనను నిబంధన తొలగించవలసినదని కోరిరి.

7. మేనేజిమెంటు ఖర్చులవిషయమై ఉపాధ్యాయుల స్కేలు గ్రాంటులో 15% మినహాయింపు లేకుండ టీచింగు గ్రాంటుపై 20% అదనముగా మేనేజర్లకు ప్రతిత్రైమాసిక గ్రాంటుతో కలిపి యిప్పించవలసినదని కోరిరి.

8. ప్రతి ఎయిడెడ్ స్కూలులో పనిజేయు ఉపాధ్యాయుల పిల్లలకు S. S. L. C. వరకు ప్రతి లోకల్‌బాడీల స్కూళ్ళలోను శ్రీ గవర్నమెంటువారి స్కూళ్ళలోను ఉచితవిద్య గరపు ఏర్పాటు చేయించవలసినదన కోరిరి.

9. ఇద్దరు ట్రెయినింగుపొందిన ఉపాధ్యాయులవద్ద ఒక ట్రెయినింగు పొందని ఉపాధ్యాయుని వేసుకొనవచ్చుననే నిబంధన ఎక్జంప్షను (Exemption)బడయ నవుసరము లేకుండ స్థిరముగా నుంచవలెను.

10. ముప్పదిమందికి పైగా ఏవరేజి ఎటెండెన్సు వచ్చినప్పుడు ఆయా తరగతులకు డివిజనుల పెర్మిషను బడయ నవుసరములేకుండ నెలసరి స్టేటుమెంటుల ప్రకారము గ్రాంటు యిప్పించవలసినదని కోరిరి.

11. పూర్వమువలెనే ప్రతి అభివృద్ధిలోనున్న పాఠశాలకు (Efficient School) 50% వరకు ఇంక్రిమెంటు ఇప్పించవలసినదని కోరిరి.

12. ప్రతి ప్రాథమిక పాఠశాలకు నెలవారీ గ్రాంటు లిప్పించుచు మరుచటి నెలాఖరులోగా ఉపాధ్యాయుల కా మొత్తముచేరునట్లు ఏర్పాటుచేయించవలెనని కోరిరి.

13. నెల 1 కి ఒక్కొక్క ఉపాధ్యాయునకు 5 రూ॥ యుద్ధభత్యము 1942 జనవరి నెలనుండి యిప్పించవలసినదని కోరిరి.

14. బడిదినములు 220 నుండి 200 లకు తగ్గించవలసినదని కోరిరి.

15. ప్రతి తాలూకా ఎడ్వయిజరీ కమిటీ (Advisory committee) లోను ఒక సభ్యత్వము ఎయిడెడ్ స్కూళ్ల మేనేజర్లకు యివ్వించవలసినదని కోరిరి.

---

## అనకాపల్లి తాలూకా ఎయిడెడ్ ప్రాధమికపాఠశాలల టీచర్లు మేనేజర్లు మేనేజర్ల స్థాయి సంఘసభ.

శ్రీదక్షిణ విశాఖపట్టణంజిల్లా అనకాపల్లితాలూకా ఎయిడెడ్ ప్రాధమిక పాఠశాలలటీచరు మేనేజర్ల స్థాయిసంఘసభ్యుల సమావేశము 13-6-43 తేదీని ఉదయం 10 గంటలకు శ్రీజార్జిఎయిడెడ్ ఎల్ మెంట్రీ సెంటరుస్కూల్ లో శ్రీ జెగ్గుమంత్రి అప్పలనరసింహులుగారి అధ్యక్షతను యీ దిగువ సుద హరించిన సభ్యులతో యిందునూదించిన కార్యక్రమము జరుపబడెను.

సభ్యులహాజరు $\frac{5}{9}$ అయిరి. (1) శ్రీ జెగ్గుమంత్రి అప్పలనరసింహులుగారు (2) శ్రీజెగ్గుమంత్రి నరసింహమూర్తిగారు (3) జల్లేపల్లి జోగారావుగారు (అరవపాలెం) (4) మళ్ల అప్పన్నగారు (వెంకుపాలెం (5) యిరగవరపు వెంకటనరసింహాచార్యులుగారు (పినమసక అగ్రహారము) (6) యీసంఘ కార్యదర్శిగారు సంఘసమావేశసమయమునకు గైరుహాజరు అయినందున ఎయిడెడ్ టీచర్సు యూనియన్ సెక్రటరీగారైన చిన్నకోట సన్యాసేశ్వరావుగారి వలన కార్యక్రమము సక్రమముగా తాత్కాలికముగ జరుపబడెను.

(1) యీసభవారు శ్రీ జార్జి చక్రవర్తిగారి జన్మదినోత్సవ సందర్భమున శ్రీచక్రవర్తిగారికి ఆయు రారోగ్యములు భగవంతుడు ప్రసాదించుచు, ప్రస్తుతయుద్ధ పరిస్థితులలో శ్రీ ప్రభుత్వమువారికి విజయ పరంపలు ప్రాప్తింపజేసి, ప్రజల దుర్భరస్థితిని అనతికాలములో తొలగించుటకు పరమేశ్వరుని ప్రార్థించిరి.

(2) యీసభవారు శ్రీ రామా అండ్ కో ఏజంటుగారైన కపిలవాయి వెంకటరత్నంగారి ద్వారా వారికంపెనీలో వుచితముగా ప్రింటుచేయించి యిచ్చిన నిబంధనలున్నూ రిజల్యూషనలున్నూ, సభ్యులకు చదివిపించిరి. జనరల్ బాడీ ఆమోదించుటకు ఒకదాని తరువాత నొకటిగా సదరు నిబంధనలు రిజల్యూషనలు, చర్చించిరి. డిపార్టుమెంటు వారికిన్ని శ్రీ గవర్నమెంటువారికిన్ని పత్రికలకున్ను సదరు ప్రొసీడింగ్సు పంపుటకు తీర్మానించిరి.

(3) పన్నెండవ రిజల్యూషను తీసివేసి సంఘమువారు బియ్యము సప్లయి గురించి చాలా ఆందోళనగా యున్నది గనుక యీసంఘ కుటుంబీకులకు ప్రతినెల నెల 1 కి సరిపడునంత బియ్యమును శాంక్షను చేయించుటకు తీర్మానించి సదరు తీర్మానమును రివిన్యూ ఆఫీసర్లకు పంపుటకు తీర్మానించిరి.

అనకాపల్లి }
13—6—43 }

ఇట్లు
జెగ్గుమంత్రి అప్పలనరసింహులు.

---

## శ్రీ దక్షిణ విశాఖపట్టణము జిల్లా అనకాపల్లి తాలూకా ఎయిడెడ్ ప్రాథమిక పాఠశాలల మేనేజర్ల టీచరు మేనేజర్ల సంఘము.

# సాధారణ సభ్యుల మహాజనసభ.

13—6—43 తేదీ మధ్యాహ్నము 3 గంటలకు జార్జి ఎయిడెడ్ యల్‌మెంట్రి సెంటరు స్కూల్ లో శ్రీ జగ్గుమంత్రి అప్పలనరసింహులుగారి అధ్యక్షతను జరుపబడెను. (1) దైవప్రార్థన. శ్రీ జల్లేపల్లి జోగారావుగారు చేసిరి. (అరవపాలెం) (2) శ్రీ ఆరవజార్జి చక్రవర్తిగారి జన్మదినోత్సవ సందర్భములో యీ సభవారు శ్రీ జార్జి చక్రవర్తిగారికి ఆయురారోగ్యములు భగవంతుడు ప్రసాదించుచు ప్రస్తుత యుద్ధ పరిస్థితులలో శ్రీ ప్రభుత్వమువారికి విజయపరంపరలు సంప్రాప్తించి ప్రజల దుర్భరస్థితిని అనతికాలములో తొలగుటకు పరమేశ్వరుని ప్రార్థించిరి. (3) అధ్యక్షుని తొలిపలుకులు—

శ్రీ అధ్యక్షులవారు సంఘబలము, దాని ప్రాముఖ్యము, సభ్యులు సంఘీభావము, విద్యాశాఖాధికారులకు తమ కష్టసుఖములు సంఘము ద్వారా తెలియపరచుకొనుటవలన కలుగు లాభములు, విద్యాసంస్థలకు జేయవలసిన సేవ, మున్నగువానిని గూర్చి విపులముగా చెప్పిరి.

(4) పిమ్మట స్థాయి సంఘసభ్యులచే ఆమోదింపబడిన, శ్రీ రామా అండ్ కో, వారిచే అచ్చువేయింపబడిన, రిజల్యూషనలు, సంఘనిబంధనలు, మహాజనసభవారి ఆమోదనముపై సభ్యుల యావన్మందికి అందజేయుడమైనది.

(5) ఈ సభవారు సదరు తీర్మానములు శ్రీ విద్యాశాఖాధికారులకున్నూ, పత్రికలకున్నూ పంపుటకు తీర్మానించిరి.

పిమ్మట యీసభ అభివందనములతో జయప్రదముగా ముగింపబడినది. ఇట్లు,

జెగ్గుమంత్రి అప్పలనరసింహం.

---

# అత్యవసర సమావేశము

సంరక్షక సంఘ మహాజనసభ సరిపల్లి (వైజాగ్ రేంజీ)

27 జూన్ 1943

శ్రీ. పి. ఎ కృష్ణారావు బి. ఏ వారి అధిపత్యమున సభముగించబడెను. 50మంది సభ్యులు, చూపరులు, హాజరైరి, ఈకరవుకాలమున ఇతర గ్రామములనుండివచ్చి నౌకరీచేయు ఉపాధ్యాయుల విషయములో ఆహారపదార్థముల సమస్యవిషయమై మేనేజిమెంటువారు తటస్థముగను; ఉదాసీనముగను, ఉన్నందులకీ సభవారు విచారమును తెలుపుచూ ఇకపైనైన భావిపౌరుల సౌభాగ్యదాతలగు నుపాధ్యాయులకు శ్రీబోర్డువారి సహాయమువలనగాని, శ్రీకలెక్టరువారి వలన పర్మిటుయిప్పించికాని, ఆహారపదార్థముల కొరత తీర్పించుటకును కోరుటకున్నూ, అన్నిగ్రామ సంరక్షకసంఘములు ఇందునుగురించి సక్రమ తీర్మానముల నాందోళనచేసి మన ఉపకారవిధిని నిరవేర్చి మనభావిపౌరుల సౌభాగ్యమును చేకొనుటకున్నూ, తీర్మానించి, వందనములతో సభముగింపు చేయడమైనది.

ఆచార్య సింహం,
శక్రటరీ.

---

# తలిదండ్రుల సంఘసమావేశము

గుడివాడ తాలూకా, పెయ్యేరు గ్రామ తలిదండ్రుల సంఘవిస్తృత సమావేశము, పెయ్యేరుబోర్డు బాలుర పాఠశాలా భవనమునందు 15-6-43 సాయంకాలము గం 8 లకు పెయ్యేరుగ్రామాధికారులును, ముదినేపల్లి లోకలు కో ఆపరేటివు యూనియన్ అధ్యక్షులును, అగు శ్రీహనుమార పేర్నీడు చౌదరిగారి అధ్యక్షతను జరిగెను.

అధ్యక్షులు ప్రాథమిక విద్యాభివృద్ధికి, నిరక్షరాస్యత నిర్మూలనకు, తల్లిదండ్రుల సహకారావశ్యకతనుగూర్చి నుపన్యసించుచు తల్లిదండ్రులు సహకారమును స్వీకరించని ప్రాథమిక పాఠశాలలు అభివృద్ధికి రావనిచెప్పిరి.

శ్రీ వల్లూరుపల్లి వీరభద్రయ్యగారు భావిపౌరులు కాదగు బిడ్డలయొక్క అభివృద్ధిని ఆశించు ప్రతి తలిదండ్రులసంఘము, ఉపాధ్యాయవర్గమునకు సంపూర్ణసహకారము చేయవలసిన బాధ్యతవున్నదనిచెప్పిరి.

శ్రీ పెయ్యేటి రాఘవయ్యగారు ప్రస్తుత సంగ్రామ పరిస్థితులనుగూర్చి ఉపన్యసించుచు అందు భారతీయుల కర్తవ్యమును వ్యక్తపరచిరి.

రాబోవు వత్సరమునకు ఈక్రింది కార్యవర్గమును ఎన్నుకోవడమైనది.

అధ్యక్షులు శ్రీ హనుమార పేర్నీడు చౌదరిగారు, కార్యదర్శి గొట్టిపాటి కోటయ్యగారు, సభ్యులు శ్రీ పెయ్యేటి రాఘవయ్య శ్రీ వల్లభనేని పిచ్చయ్య, శ్రీ దుక్కిపాటి వెంకటేశ్వరరావుగార్లు కార్యదర్శి అభివందనాలతో సభ సమాప్తము గావింపబడెను.

జి. కోటయ్య,
కార్యదర్శి.

---